# పోలీసు ప్రజా పరిష్కార సూచన

## "పోలీసు ప్రజాసేవకుల"ను రహస్యము సర్వత్ర వ్యక్తము కావలెను

జనులలో విద్యావ్యాప్తి, ప్రజాహితదృష్టి, పౌరసత్వ విధిజ్ఞాన మత్యవసరము

## ౧౩౪౫ ఫసలి పోలీసుశాఖ నివేదిక

ఈనివేదికలో ప్రశంసనీయ విషయములనేకములు గలవు. ఈనివేదిక ౧౩౪౫ వ సంవత్సరపు—సకాలములో వెలువడుట—దగుటనొకటి. అవసరవిషయములు చేర్చక ముఖ్యవిషయములను వివరించుట రెండవది. జిల్లా పోలీసు అధికారులకు మిస్టర్ యస్. టి. హాలిన్సు సి. ఐ. ఇ. గారునిష్పాక్షికముగా నిర్భయముగా సత్యయుక్తములుగానుండు తమ యభిప్రాయములను ప్రకటించుట మూడవది. ఇటులనే మరికొన్ని గలవు.

ఈనివేదికలో గమనింపదగిన విషయములు: నివేదికకాలములో రాష్ట్రమందు హిందూ ముసల్మానుతగవులు జరిగిన ముఖ్య ప్రదేశములు:

౧. అజంటా గ్రామములో శ్రీరామనవమీ దినమున హిందువులు ఒకదేవాలయములో బాజా వాయించుటను తెరకలాక్షేపించిరి. స్థానికాధికారులమాటపై అది నిలిచెను. ఆప్పటికిని ముసల్మానులు హిందువులను తమ తమయిండ్లకు పోవుచుండగా పైబడి కొట్టిరి. బహుకష్టముతో ఈతగవు మాన్పబడెను.

౨. గుల్బర్గాలోని మానక్నిగరులో ఆర్యసమాజీలు సభచేసి ఊరేగింపుచేయగా వారిపాటలు ముసల్మానులకు నచ్చక ఉభయులు చేతులుకలిపిరి. ఫలితము పలుగురుముసల్మానులు గాయపడిరి.

౩. బిదరులోని ఖండాలలో ఒక హిందూ స్త్రీ తురకఆయ్యెను. తురకను పెండ్లిచేసుకొనెను. హిందువులు జవాబుగా తురకలనుదరిచి చావనికిరానీయలేదు. ఫలితము తగవు. కోర్టువిచారణ, శిక్షలు.

౪. సేలంగాలో ఒక ఆర్యాభార్య తురకయయ్యెను. తగవుతేర్పడెను. పోలీసులు ఉద్రిక్తజనులను తరిమివేసిరి.

౫. [illegible] త్రాగుచు అర్యసమాజసభలో ప్రవేశమయ్యెను. బల్వాఅయ్యెను. పోలీసు సిబ్బందివచ్చి తరిమివేసెను. పోలీసువారి కీవిషయము జరుగబోవునని ముందుగానే తెలిసియుండెను. ఏమియు చర్యలుతీసికొనలేదు. అందుచే సర్కారు అమీను ఒర్తరఫు చేయబడిరి.

ఈ అయిదు ఉదహరణములు నివేదికలో నీయబడినవి. వీనిని మేమును ఉదహరించుట ఏలన హిందూముసల్మానుల కేయే కారణములలో తగవులేర్పడుచున్నవో తెలుపుటకే! హిందూముసల్మానులకు తగవులకు ముఖ్యము కారణములు:

౧. హిందువులయొక్క మతసంబంధపు ఊరేగింపులు ఆ ఊరేగింపులలోని పాటలు, వాయిద్యములు.

౨. ముసల్మానులయొక్క (తబ్లీఘ) మతాంతర ప్రచారము. ఎంచెందు ముసల్మానులు హిందువులను తురకలనుగా జేయుచున్నారో అందందు హిందువులపక్షమున ఆర్యసమాజమువారు హాజరుఅగునట్లు కనబడినది, అందుపై ఉభయసంఘములలో ఎన్నడును లేని ఉద్రేకములు, ద్వేషములు, యుద్ధసన్నాహములు తుదకు ఏకైనసమయము దొరకినప్పుడు సంఘర్షణ అగును కొంత ప్రాణనష్టము. ఇది పరిపాటి యగుచున్నది. [illegible] పోవుటకుపాయుగా [illegible] మాకు భయమగుచున్నది. ఎందుకన ఒక సంవత్సరమునుండి నవాబు బహద్దరుయార జంగు బహద్దరు గారున్ను వారి అనుయాయులున్ను జిల్లాలలో హరిజనులను గుంపులుగుంపులుగా తురకల చేయుచున్నారనియు, వారినిమరనే ఆర్యసమాజమువారును వెళ్లుచున్నారనియు, అందందు కొన్నితగవులు జరిగినవనియు, కొన్ని కోర్టులకెక్కినవనియు, వినుచున్నాము. పోలీసువారిపై అందరికన్న యెక్కువబాధ్యత యుండును కావున ఈవిషయ మిందువిపులముగా వ్రాయుచున్నాము. హాలిన్సు గారు నిష్పాక్షిక స్వభావులు. కావున పైవిషయ చర్యలో తమవిధిని సరిగాచేయనివారిని బర్తరఫు చేసిరటుల స్పష్టముగా నివేదికయందు గలదు.

ఈనివేదికలో గమనించవలసిన రెండు విషయములు:—పోలీసువారికిని ప్రజలకునుగల సన్నిహితసంబంధము, హాలిన్సుదొరవారు ప్రథమములో ఉద్యోగస్వీకారము చేసినకాలమందే ఒక అపూర్వోపన్యాసము పోలీసువారికి కావించియుండిరి. పోలీసు ప్రజలను బెదరించు అధికారులుకారనియు, ప్రజాసేవకులనియు, ప్రజారక్షణ వారి ముఖ్యమైన సేవాధర్మమనియు, విశదముగా బోధించిరి. ఇట్టిభావముల అవసరము చాలకలదు. ఇప్పటనేకాక బ్రిటిషిండియాలోను పోలీసువారికిని ప్రజలకును చాల అంతరాయముకలదు. పోలీసువారలనిన ప్రజలకు భయము, అనిష్టము. ప్రజలనిన పోలీసువారికి లెక్క జమా లేనిసరకు. ఇట్టిభావములకులోనై ఉభయవర్గములందు ఎన్నడును పరస్పరసానుభూతి లేకుండెను. హాలిన్సుదొరవారీసమస్యను పరిష్కారరూపమునకు తెచ్చుచుండుట సర్వజనాంగీకారము.

మనరాష్ట్రము పోలీసువారి కేసులలో చాలానుఆయిన కేసులలో నూటికి ౩౯.౭ మాత్రమే [illegible] తింపనవసరము లేదనుచు బ్రిటిషిండియాలో నీరీతిగా నివేదిక పోల్చి చూపబడినది.

| రాష్ట్రము | జయించిన కేసులు నూటికి |
|---|---|
| హైద్రాబాదు | ౩౯.౭ |
| బొంబాయి | ౪౦.౭ |
| మధ్యపరగణాలు | ౩౨.౫ |
| మద్రాసు | ౮౯.౩ |

ఇట్లుచూచినను మద్రాసులో మాత్రము అపూర్వజయమును సూచించినది. నూటికి ఇంచుమించు ౯౦ కేసులలో జయమనిన ఇది ప్రపంచములోకూడనారు వైనరికార్డే (World record) అనవలెను. మద్రాసులో ఇట్టిజయము పొందుటలో ఏమి విశేషమో హాలిన్సుదొరవారు ఒకమంచి అధికారిని మద్రాసు రాజధానికి పంపి తెలిసికొనివచ్చుటకు ఏర్పాటుచేసిన బాగుండునని సూచించుచున్నాము.

నిందితులాచరించు ఘోరాతి ఘోరములలో "ఖూనీ" అగ్రగణ్యమైనది. అట్టి నేరములలో పోలీసువారు చాలాము చేసిన హత్యాపరాధములలో నూటికి ౨౬ మాత్రమే జయముపొందెను. "ఈ అంకెలు నిజముగా గర్హ్యముగానున్నవి" అని నివేదికలో వ్రాయుచు దానికి కారణములుకూడ వ్రాసినారు. ఖూనీ కేసులలో చాలాభాగము కోర్టులలో కొట్టివేయబడుటకు

(౧) జనులలో ప్రజాహితైకదృష్టి (Public spirit) లేకపోవుట. వారు పోలీసులకు సాయపడకుండుట.

(౨) సాధారణ జనుల మెదడు చాల మందబుద్ధిగానుండుట (Intelligence of the common people is very low) అందుచేత సాక్ష్యములలో తడబాటుపడి కేసులు చెడగొట్టుట!

(౩) మనిషిప్రాణముల విలువ చాలా ప్రాంతములలో అగ్గువలో నుండుట.

[Human life is held cheap]

ఈమూడు ముఖ్యకారణములు చూపబడినవి. ఈ విషయ పరిశోధనము (Diagnosis) అపూర్వమైనది. హాలిన్సుదొరవారు మనలోవచ్చి రెండుమూడు సంవత్సరములుకూడ కాకపోయినను మనరాష్ట్ర పరిస్థితులను చక్కగా సూక్ష్మముగా గ్రహించినారు. వారుచూపించిన కారణములలో ఒక అక్షరముకూడ అసత్యము కాదని మా యభిప్రాయము.

> రాబోవు సంచికయందు ప్రకటింపబడనున్న యూరపు రాజకీయ రహస్యములు తప్పక చదువతగినది. "యుద్ధము సంభవమా?" యను విషయము వివిధదేశముల పరిస్థితుల ననుసరించి విశదీకరింపబడినది.

ఈ రాష్ట్రములో పోలీసువారికి నిజముగా జనులు సాయపడరు. ఏలన పోలీసువారు గర్జనతర్జనలతో పని తీసుకొనుటయు, సాక్ష్యులుగావచ్చువారిని నాకొను, తాలూకాను, జిల్లాను సూబాపతిప్పుట వేధించుటయు, వారికి సరిగా బత్తెములు సవారి ఖర్చులు ఇప్పించకపోవుటయు, జరుగునేమో అని ఎన్నియో శంకలతో జనులు కూడియుందురు. ఈ పరిస్థితులు పోవుటకు హాలిన్సు గారిదివరకే యవలంబించిన మార్గమే యుత్తమము, పోలీసువారు జనుల సేవకులను దృష్టికేవలము పోలీసువారికేకాక జనులకును సర్వత్రవ్యక్తము కావలెను.

తక్కిన రెండుకారణములును—జనుల తెలివితక్కువతనమును, ప్రాణముల విలువ ఎరుగకుండుటయు అనురెంటికిని ఒకేచికిత్స. జనులలో విద్యావ్యాపకము కావింపవలెను. ఈ విషయమునుగూడ హాలిన్సు గారు గమనించి యిట్లు వ్రాసినారు.

"ఈ విషాదపరిస్థితులకు చికిత్స లేమన—జనులలో విద్యావ్యాప్తి, ప్రజాహితైకదృష్టి, పౌరత్వవిధుల సెరిగియుండుట అను నీమూడు గుణములు పెంపొందింపవలెను."

[The chief remedies for the present unhappy state of affairs as regards murder cases are—the spread of education, the growth of public spirit an the realisation by the people of their duties as citizens of the state.]

మొత్తముపై ఈనివేదిక చాల ఉత్తమమైనది హాలిన్సుదొరవారు జిల్లా పోలీసు అధికారులై వచ్చుట రాష్ట్రముయొక్క గొప్ప అదృష్టము. పూర్వము హాంకిన్సుదొరను నేటికిని పల్లెలలో ప్రజలు—అందు ముఖ్యముగా ఆంధ్రులు వారికి "యంకన్న" అని నూతన నామకరణము చేసి—పలుమారు ప్రీతితో స్మరించుకొనుచున్నారు. జిల్లా పోలీసుకచ్చేరిని ఇప్పటికిని పల్లెటూరివారు "యంకన్నకచ్చేరీ" అని విచారించుచుందురు. హాలిన్సుగారును ఇదేవిధముగా చిరకాలము ప్రజలచే ప్రీతితో స్మరింపబడుదురను మా దృఢవిశ్వాసమును ప్రకటించుచున్నాము.

---

The only Leading National Bi-weekly of the whole Andhra Desa

GOLKONDA PATRIKA is The best medium for all traders and dealers — Advertise at once

# గోలకొండపత్రిక

# Golkonda Patrika

PUBLISHED ON EVERY MONDAY AND THURSDAY

GOLKONDA PATRIKA is The only popular voice of 7,000,000 Andhras of THE NIZAM'S DOMINIONS

Volume 12 | HYDERABAD-DECCAN MoNday 27 September 1937 | Number 40

## గష్తీ నిషాను ౫౩ ను వెంటనే తొలగించవలెను

### ఇపుడు దాని అవసరమే లేదు

రాజకీయ విజ్ఞానమును ప్రజలలో వ్యాపింప జేయవలసినకాలము వచ్చినది

హైదరాబాదు కాంగ్రెసు అధ్యక్షుడు ప్రధానమంత్రికి పంపిన విన్నపము

హైదరాబాదు కాంగ్రెసు కమిటీయొక్క అధ్యక్షులగు సిరాజుల్ హసన్ తిర్మిజి, యం. ఏ. యల్ యల్. బి. గారు మన నిజాం ప్రభుత్వ ప్రధానమంత్రిగారికి ఈ క్రిందిలేఖను పంపుకొనినారు

"తాము కరుణించి అనుమతించిన యెడల, హైదరాబాదు కాంగ్రెసు కమిటీయొక్క అధ్యక్షుడనైన నేను ఆకమిటీపక్షమున ఈ క్రిందివిషయములను విన్నవించ గోరుచున్నాను.

మనసంస్థానము భారతీయ సంస్థానములన్నిటికంటెను మొదట శాసనసభ, దేశీయభాషలో విద్యనేర్పుట న్యాయశాఖను కార్యనిర్వాహకశాఖనుండి వేరుచేయుట మున్నగు పరిపాలన సంస్కరణములు ప్రారంభించినదైనందుకు మనము సంతృప్తి జెందుటయే గాక గర్వించవలసియున్నది. ఈసంస్కరణలు ప్రారంభించినందుకు ప్రజలు తమ ప్రభువుగారికిని ప్రభుత్వమునకును కృతజ్ఞులైయున్నారు. ...మైన అసౌకర్యమొకటి అట్లే నిలచియుండుట వారలకు చాలకష్టము కలిగించుచున్నది.

"కాలిగష్తీ" అనుపేర ప్రజలకు తెలిసియున్న గష్తీనిషాన్ ౫౩ ప్రజలకు వారల జన్మహక్కు, అనగా వాక్స్వాతంత్ర్యము లేకుండజేయుటయేగాక, అప్పుడప్పుడు పరిపాలనయందు ప్రవేశపెట్టబడిన సంస్కరణల తత్వమునకు ప్రతికూలముగనున్నదని నేను తమకు చెప్ప సాహసించుచున్నాను. తమ ప్రజలఅభివృద్ధికి మూలచ్ఛేదకమగు అట్టిచర్యను అభివృద్ధియందుండు ఏప్రభుత్వముగాని అవలంబించజాలదు. అవలంబించరాదు కూడను

వాక్కు మానవునికి భగవంతునిచే ప్రసాదించబడినది. దానిని, క్రమాదకరమగు కారణమేమియు లేకుండ, నిరర్థ్యంతరముగ అణచివించనీయకపోవుట పాపము. ఈగష్తి రాజకీయసభలను నిషేధించుటకు ఉద్దేశింపబడినది ఈవాదమిక నిలువజాలదని భయపడుచున్నాను. ౧౯౩౫ సం॥పు ఇండియా రాజ్యాంగశాసనము ప్రవేశపెట్టుటతో, ఫెడరేషను రానున్నపుడు, రాజకీయములనబడునవి ఇక నెంతమాత్రము నిషిద్ధములు కాజాలవు. కొద్దికాలములో తాము ప్రకటించనున్న మనసంస్థానపు రాజ్యాంగ సంస్కరణములుకూడ ఈ రాష్ట్రములో రాజకీయ జ్ఞాన వ్యాప్తి అవసరమగునట్లు చేసినది. ఇకమీద రాజకీయవిద్యను జనసామాన్యమందు వ్యాపింపజేసి, ఈరాష్ట్ర పాలనలో వారలు ఉచితగౌరవమును పొందునట్లుచేసి, మొత్తము రాష్ట్రమంతయు క్రొత్త రాజ్యాంగశాసనము ననుసరించియుండు భారతదేశ రాజకీయజీవనములో అగ్రస్థానము పొందునటుల జేయుట ప్రభుత్వమువారి విధియని ప్రజలు తలచుచున్నారు. ఓటుహక్కుగల ప్రజలసంఖ్య ఎక్కువయగురోజులు రానున్నపుడు, రాజకీయములు పూర్వముకంటె ఎక్కువమంది అనధికారులదృష్టిని ఆకర్షించుచున్నపుడు, సంస్కరణలకు స్పష్టముగవిరోధియగు గష్తీనిషాను ౫౩ ను రద్దుచేయుట ... కోరిక గాదు

"...సహజము అగష్తీని రద్దుచేయుటయే పై ఉద్దేశ్యములను సాధించుటకు త్రోవయొసగుటకు మొదట చేయదగిన పని.

"ఈనిర్బంధ నియమమునుగూర్చి ఇదివరకెన్నియో ఖండనలు చేయబడినవి, సభలు జరుపబడినవి, తీర్మానములు చేయబడినవి, విజ్ఞప్తులు పంపుకొనబడినవి, ప్రభుత్వమువారివద్దకు రాయబారులు పంపబడిరి ఇట్లు అనియమమును రద్దుచేయవలెనని సమర్థించుటకు చూపవలసిన కారణములన్నియు స్పష్టముగా చూపబడినవి ఇది ప్రజలఅభివృద్ధి నాటంకపరచినదని చెప్పినారు అదంతయు మరల యిపుడు చెప్పవలసిన పని లేదు

"ఒక్కవిషయమునుమాత్రమే యిపుడు చెప్పవలసియున్నది దానిని ప్రవేశపెట్టినపుడు, అది సాధించవలసిన ఉద్దేశ్యమేదియుండినను, ఇపుడాయుద్దేశ్యముతీరి ఎంతోకాలమైనది. నేడీగష్తీ పెద్ద బండకొయ్యవలెనున్నది కాబట్టి ఈగష్తీని, ప్రజల క్షేమముకొరకేగాక ప్రజలకు దయతో ప్రసాదింపబడుచున్న సంస్కరణలకు అనుగుణముగ నుండుటకైగూడ వెంటనే తొలగించుట అవసరము"

---

## బీజనాపల్లి

(ఒక విలేఖరి)

౧౫ ఆబాన్

ఈగ్రామములో సుమారు రెండు మూడు మాసములనుంచి వర్షము ఏమాత్రమును లేక పైరులు ధ్వంసమైనవి. జంతువులకు తినుటకు పచ్చికలేదు పేద కుటుంబములవారలకు తినుటకు తండులములు లేనందున మంపగడ్డలను తమ యాహారముగా ఉపయోగించుకొనుచున్నారు. అదికూడ పూర్తియై పోవుచున్నవి అన్నమో రామచంద్రాయని, కలవరించుచున్నారు.

ఈ గ్రామమందు తన్ జీముదహీకు అధ్యక్షులుగాయున్న మ రా శ్రీ చెన్నారెడ్డి దేశముఖ్ మరియు విట్టనారాయణశెట్టిగార్లు మా మాదుగులమీద కరుణవహించి వారికి కొంత ధాన్యమివ్వగోరిరి దానికి అల్పజనులు సమ్మతింపక తహసీలుదార్ సాహెబ్‌గారి సన్నిధిలోనికి వెళ్లి ధాన్యమంతయు ఒకే పర్యాయము యివ్వమని మొర పెట్టుకొనగా అధికారుగారు వీండ్లనుంచి తన జీముదహీకు సంబంధించిన పని తీసుకొని కూలి యివ్వవలసినదని మురాసిలా పంపిరి, దేశముఖ్ గారు పని జరుపుటకై కావలసిన పనిముట్లు వప్లయిచేయించిరి. ఇంతలో భగవంతుని కృపవలన రాత్రి సుమారు ౨ గంటల సమయమున వానకురిసినది.

---

## కమిటీ మాత్రమే

పూర్వముకంటె రాజ్యాంగములో అభివృద్ధిని నిర్ణయించు ఏదో గొప్ప ప్రకటన చేయబడునని కనిపెట్టుకొనియుండగా, ఒక కమిటీస్థాపనమాత్రమే ప్రకటించబడినదని హైద్రాబాదులో చాలమంది ఆగ్రహపడుచున్నారు. ఆకమిటీ ఆలోచనల ఫలితముగా రాజ్యాంగము ఇప్పటికంటె ఉదారమైనదికావచ్చును, కాని బ్రిటిషుఇండియాలో అనుభవముతో జూచినచో, అట్టికమిటీలను నమ్ముకొనియుండుట ప్రమాదకరము సాధారణముగా వారలు కాలగతిననుసరించజాలరు. సర్ అక్బర్ గారు తాము ఏర్పరచినకమిటీకి అట్టిగతి పట్టకుండ చూతురని ఆశించుచున్నాము.

సర్ క్షే మైమ్సు

---

### రాంపూరు అల్లరులు శాంతించుట

౧౯ సెప్టెంబరు నాటికి రెసిడెంటువచ్చి రాంపూరు ప్రభుత్వమువారు ప్రజలకోరికలలో కొన్నితీర్చెదరని తెల్పుటచే ప్రజలఆందోళన శాంతించినది ఇపుడు ప్రజలలాభమునకై ప్రభుత్వమువారు పరిశ్రమలను స్థాపించనున్నారు

---

## ఆరవ ఆంధ్ర మహాసభాధ్యక్షులు

### మందుముల నరసింగరావుగారు ఎన్నుకొనబడిరి

మొన్న శుక్రవారమునాటి ఆంధ్ర మహాసభ స్థాయిసంఘములో జిల్లాసంఘముల పక్షమునుండి వచ్చిన వోటింగులను లెక్కపెట్టగా ఈక్రిందివిధమున వోట్లు వచ్చియుండెను.

| జిల్లా. | ఎన్నుకొనబడినవారు |
| --- | --- |
| ఆత్రాపుజిల్లా, భాగాతుజిల్లాలు | మ. నరసింగరావు |
| మెదకు | ,, |
| కరీంనగరు | ,, |
| మహబూబునగరు | ,, |
| హైదరాబాదు, సికిందరాబాదునగర ఆంధ్రసంఘము | ,, |
| నల్లగొండ | పి. గిరి వెంకటరామారెడ్డి దేశముఖు |
| నిజామాబాదు | శ్రీ రాజా రాజేశ్వరరావు బహాదురు దోమకొండ సంస్థానాధీశులు. |

వరంగలులో జిల్లాసంఘము లేనందున అచ్చటివ్యక్తుల అభిప్రాయము జిల్లా సమ్మతి తీసుకొన వచ్చునా లేదాయను చర్చపై సభలోజరిగిన ... వరంగలు జిల్లావారు వోటు ఇచ్చియుండిరి. ఈప్రకారముగా వివరములు తెలిసికొనినతర్వాత ... మందుముల నరసింగరావుగారు బహుజనాభిప్రాయముచే అధ్యక్షులుగా నిర్ణయింపబడినారని తీర్మానించి నిజామాబాదు ఆహ్వానసంఘమువారు వారిపేరును సూచించి ప్రభుత్వాంగీకారము పొందుటకై తెలుపబడుటకై తీర్మానింపబడెను

---

## క్షుద్బాధ పీడితుల దురవస్థ

### ఆబాలగోపాలము అన్నము పెట్టుమని అల్వాలలో అరచుట

౨౦౦ క్షుద్బాధితులకు ౨ పల్లాల జొన్న లొసగుట

నందివనపర్తి ౧౭ అబాన్.

(స్వకీయ విలేఖరి)

ఇది మహారాజా సర్ కిషన్‌ప్రసాదు బహద్దురువారి పేటు గ్రామము వర్షారంభము నుండి సస్యానుకూల వర్షములేనందున తొలకరి వానలకు కాలము సుభిక్షముగా నుండునని రైతులు సాగుబాటుచేసిరి కాని పత్తినములు మొలకెత్తుటకు మారుగా యెండ వేడిమికి తాళలేక లోలోపలనే మాడి బొగ్గయినది, కొంత ఫలించినది వర్షము లేనందున మొలచినపైరు నశించినది ... సీరు బంగారముగా పరిణమించినది,

పరిస్థితులు గాంచి సాహుకారులు, ధాన్యము నిలువయుంచుకున్నవారు, బీద రైతుల కిచ్చుటకు మానుకొనిరి ఈ రెండు మాసములనుండి పడరాని యిడుముల బడి, కందమూలములు తినుచు కాలము గడుపగలిగిరి వారాటికి దుర్భరమగుటంజేసి అపరకర్ణుడని ఖ్యాతి గడించిన మహారాజా గారివద్ద మొఱపెట్టుకొని బాధనుండి విముక్తులగుట కోరించి ౧౪ వ తేదిరోజు సుమారు ౫౦౦ప్రజలు — స్త్రీలు, పురుషులు బాలురు వృద్ధులు, బాలింతలు మొదలగువారు — పిల్లలను వీపునను మోపుగా బంధించుకొని దర్బారము ఆలవాల సౌధమునకు వెళ్లిరి మహారాజాగారు స్వయముగా వారి స్థితిగతులను కండ్లారచూచి వారి దరఖాస్తులను తీసుకొనిరి వీరినడ్డనే ౧౦దేరావుగా యుండిరి వెంటనే పైనుండి క్రిందికివచ్చి "రెండు రోజులలో స్వయముగావచ్చి విచారించెద"నని బుజ్జగించిరి వారికెప్పుడు దయ గలుగునో, యెప్పుడు విచారించెదరో, యెప్పుడు బాధలనుండి విముక్తులజేయుదురో తెలియదు,

దరఖాస్తు విషయములు

రైతులు మహారాజా గారికిచ్చిన దరఖాస్తుయందిటులున్నటుల తెలియుచున్నది —

౧. బావులలో నీరింకిపోయినందున ఆలుకబడిన పొలములందు పైరు ఎండిపోవుచున్నవి నీటివసతికై పేటువారు బావులు త్రవ్వించుట

౨ గ్రామమునందధికారులు నిర్దయులై మాపై అన్యాయముగా మోపిన బాకీలు వసూలు చేయుచున్నారు తత్క్షణమే ఆపవలయును

౩ ఇదివరకు మేము మాకష్టఫలితమంతయు పేటుకు ధారపోసితిమి మాకు దుర్గతి సంభవించినందున మాకు ధనసహాయము చేయుట

౪ మాపశువులు మేతలేక మరణించుచున్నవి మేతసప్లయి చేయించి పశువుల కాపాడుట పశువులు చాలానష్టపడినవి కొట్టిరిగి పశువులు కొనుటకు ధన మిప్పించుట

౫, మా కావార మిప్పించుట

సహాయము

హరిజనులస్థితి యీ క్షామము వలన మహా దుర్భరముగా పరిణమించుటచే సుమారు ౨౦౦ మంది మహారాజా గారివద్దకు అస్థిపంజరములతో "అన్నము దేవుడా"యని మొఱలిడుచువచ్చిరి. గుండేరావు గారు వీరికి పల్లన్నర జొన్న లిప్పించిరి ఇది వీరికెంతకాల మొచ్చును? "రెండిలేక మలమలమాడుచున్న మాకిదిసరిపోదు ప్రభో" యని మొఱలిడిరి

పేటుఅధికారు లీసమయమున విశాల హృదయముతో, కృపాభావముతో రైతులరక్షించిన బాగుండదా?

---

## సంస్థానాధీశుల ప్రతిక్రియా ప్రవర్తన నిరసనము

### ఫెడరేషనులో చేరుట క్రొత్తయిబ్బందులంటగట్టుకొనుట

సంస్థానప్రజలకు జవహర్లాలు నెహ్రూగారి కర్మయోగ రహస్యోపదేశము

౧౯ సెప్టెంబరు తేదిన పండిత జవహర్లాలు నెహ్రూగారు బీవారుసంస్థానము దర్శించిరి. రైల్వేస్టేషనువద్ద నగరప్రముఖులనేకులు నెహ్రూగారిని స్వాగతపరచుచు అలంకరింపబడిన వీధులనుండి యూరేగింపుతో ప్రజలు పండితుని నగరమునకు తీసుకువెళ్లిరి

ప్రతిధ్వని యంత్రములమర్చబడిన మిషన్ మైదానమునందు పండితుడు సుమారు గంటన్నరకాల ముపన్యసించిరి. మైదానమంతయు యీనినట్లుగుపడుచుండెను. వేలకొలదిజనము తండోపతండములుగా పండితుని యుపదేశము వినుటకు తహతహపడుచుండిరి.

స్వాగతమొసర్చి, పారితోషికములర్పించిన వివిధసంఘములకు, వర్తకులకు, ప్రజలకు తమకృతజ్ఞత తెలుపుచు "ఈమాత్రపు పొగడ్తలతో నేను సంతోషించువాడను గాను దేశమునంకొనవలయును, భారతీయులందరు, మీరే ప్రాంతమందున్నను, యేపరిపాలనము నందుండుచున్నను, కాంగ్రెసున కాధీనులై యుండవలయును అమితమగు శక్తి సంపదలా క్రమనిర్మాణసంస్థకు మీరేర్పరచవలయును. ఆ మహా సంస్థ యుద్దేశాదర్శములా బాలగోపాలమువరకు వ్యాపింపజేయవలయున"ని మహోద్బోధించిరి

"నేను నేటి శాసననిర్మాణమునకొక ఘోరశత్రుడను అందువలన దేశమంతయు, కల్పితయాటంకముల వంతెనొందించి, దాని నిర్మూలమునకు కంకణబద్ధులు గావలయున"ని హెచ్చరించిరి.

సంస్థానప్రభువుల ప్రతిఘాతక ప్రవర్తనలపై ఖేదించుచు "నేడు మీరందరు ఫెడరేషనులో చేరుటకు నిశ్చయించినారు. ఇదికేవలము తమకష్టములు, యిక్కట్టులు వృద్ధిజేసుకొనుటయే నేడు మార్వాడుప్రాంతమందలి కొన్ని ప్రదేశములు సంస్థానాధీశుల పరమైనప్పటకు ప్రయత్నింపబడుచున్నది. ఇది విషాదకరమేగాదు సిగ్గుచేటు. మీరందరి యవమానకరమైన పద్ధతి నదని యాటంకపరచవలయును ఇంతేగాదు సంస్థానాధీశుల పరమొనర్చుట భాగ్యముగాదని బ్రిటిషుప్రభుత్వమునకు తెలుపుట మీ ముఖ్యకర్తవ్యమ"ని సంబోధించిరి.

స్థానిక ప్రజాసేవకులగురించి ప్రభుత్వమువారవలంబించిన క్రూరపద్ధతి నిందాస్పదమని స్పష్టపరచిరి.

... అపరాధమునకు ౧౮౦౦ కార్మికులపై అధిక పన్ను విధించు కమీషనరు పదవికి అనర్హుడు ఇట్టి అన్యాయముగురించి కార్మికులు, మిల్లుయజమానులు, జనసామాన్యము నోరెత్తక మూలగొరవ్వులమాదిరి మౌనము వహించుట ఆశ్చర్యకరము. కార్మికులందరేకమై సంఘీభావముతో ప్రవర్తించుటత్యవసరము. వీరియందు భేదము బాధముకలిగించుటకు ప్రయత్నించు వారందరు మీకు గర్భశత్రువులని మీరు నిర్ణయించుకొనుడ"ని కార్మికులకు బోధించిరి

---

## గద్వాలలో రైతుల తిరుగుబాటు,

### కోటచుట్టు రైతులముట్టడి, ధాన్యపు కొట్టుముల లూటీలు

ఘోర క్షామ ఫలితములు

## అరెస్టులు

హైద్రాబాదు(దక్కన్) ౨౩ సెప్టెంబరు దక్కనురైతు ప్రపంచపు రైతులందరిలోను అతిదరిద్రుడు. హైదరాబాదు సంస్థానపు రైతులు సహజముగ ఇందులోచేరుదురు. ఇపుడు రాయచూరు, మహబూబునగరు, నల్లగొండ, జిల్లాలలో అనేక తాలూకాలనుండి వచ్చినవార్తలవల్ల అచోట్ల అంటువ్యాధులతోడు వర్షములుతప్పి కరువుబాధపట్టినట్లు వార్తలువచ్చుచున్నవి. ఔరంగాబాదు జిల్లాకూడ క్షామము ఎదుర్కొనినది.

దాదాపు అన్ని జిల్లాలలోను క్షామము విడిచి విడిచి బాధించవచ్చునని భయమేర్పడుచున్నది. ఈసందర్భమున హైదరాబాదు సంస్థానములో మదరాసురాష్ట్రములోని కర్నూలుజిల్లాప్రక్కనున్న గద్వాలసంస్థానమునుండి వచ్చినవార్తలు రైతుల తిరుగుబాటును సూచించుచున్నవి ఆ క్షుధితులు ఆకలికితాళలేక, చెట్లను కొట్టుచున్నట్లును, ధాన్యపుకొట్లను, కల్లు దుకాణములను లూటీ చేయుచున్నట్లును తెలియుచున్నది

మరియు చుట్టుప్రక్కల గ్రామముల నుండి నూరుమందిజనులు గద్వాల నగరమునకు చేరి కోటనుముట్టడించినారు మహారాణిగారు కోటలోనుండి వెలుపలికి వచ్చుటలేదు తాలూక్దారుగారు, అనేకులను అరెస్టుచేయించిరి పరిస్థితులు ఇంక లొంగలేదు.

రైతులు ఈవిషయములో ప్రభుత్వము వారు జోక్యముపుచ్చుకొని, సందర్భోచితముగ నొసంగునట్లు చేయవలసినదిగ విన్నపములు పంపుకొనినారు

—ఇండియన్ యక్స్‌ప్రెస్.

Printed and Published by: G. Ramakrishna Reddy at the Golkonda Power Press Hyderabad, Editor K Balakrishna Reddy